పద్మి—(అప) బాబూ! ఒడలు సుసలగానున్నది.

సోమ—(అప) ఆపానకలోనవి కప్పి, ఆకుకూడ బాగుగాఁ దిరుగవేయించి మఱీ యమ్మాయికిప్పుడు,

పద్మి—చిత్తము. (పానకపుమూకుడుఁబోయు) ఓయిరా. ఈ పానక నెత్తిపైనెత్తుకొనఁగలవా?

అబ్బీ! నీవు వెలుపలకుఁ బోవచ్చును. (వాఁడు పోవును)

భైరవ—ఆఁడుదాసనుగదా, ఇంతబరువెత్తఁగలనా?

పద్మి—సరే! నేనుగూడ సాయముచేసెదను. (తనలో) ఒడలు తడిమి దీని బాగుగా శోధింపవలెను. (ఇద్దఱు పానకనుబట్టి కొంత ముందునకువత్తురు పానకయచ్చులఁబెట్టి పద్మిని ఆతనిరొమ్ముడలు తడుమును) (అపవారించి) ఏమే నీరొమ్ములు మానిసొమ్ములవలె మెత్తగాలేదే! అడవివారగుటచేఁ గాఁబోలు.

భైర—(అప) కోటలో మగపెట్టుకొనుట తప్పని మునుపంటివే. రాజుగారింటనుండఁగాఁ గౌఁగిలించుకొనవచ్చునుగాఁబోలు.

పద్మి—ఆ—ఆ—భైరవన్నవే?

భైర—కాదామఱి.

పద్మి—ఆనవాలు దెలియకుండఁగ నెంత్రకన్యవలెగ వేషము వేసినావురా.

భైర—మొదలేలేదింక—దాసిమీఁదఁగని. అట్లైన దాసిదాని మగఁడు. రసపుష్టికిలోపమేమి?

పద్మి—కాని నీవిప్పుడు లోనికేందులకు?

భైర—ఈపండ్లబుట్టలోఁ బ్రశస్తమైన తాటినిచ్చెనయున్నది. చప్పుడు రాకుండ పానకబుగ్గలలో గట్టిగ దాని నల్లి బిగించితిని. అది పెండ్లికూఁతురుగారి మేడమీఁద నెక్కడగట్టిన యెడల దిగుటకు

వీలుగానుండునో యక్కడఁజూచికట్టెదను. దానివెంట రాత్రి మీరు దిగవలెను. మీకోటకుఁ గ్రింద నేను గనిపెట్టియుందును.

పద్మి—పాపము. సర్వమంగళ యట్లు దిగఁగలదా ?

భైర—కాత్యాయనమ్మ నిచ్చెనవెంట యంతఃపురములోని కక్క యామెను దింపును—పిమ్మట ప్రక్కప్రక్కలను గనిపెట్టియున్న భ్రమరసింగు, సుబ్బారెడ్డి మొదలగువారితోఁ గలసి బహిరంగముగా వీధిలోనికిఁబోవచ్చును. నిచ్చెనకట్టి నేనుబోయి యూరువెలుపల నున్న కాత్యాయనమ్మను దీసికొని రావలెను. నడు—నడులోనికి.

(వారిద్దఱు పోణకను సాయపడి లోనికి దీసికొని పోవుదురు.)

సోమ—భ్రమరసింగూ! ఇంతసేపును మీరు మాటలాడకుండ నేమియాలోచించుచున్నారు?

భ్రమ—నీ దర్శనమునకై తమకుఁ జూపవలసిన బంగారువస్తువులు మొదలగునవియున్నవి. అవి తీయుచున్నాము.

సోమ—బంగారువస్తువులైన మాకక్కఱలేదు. కప్పమిచ్చినారు కావునఁ జెప్పఁదగిన రాచపనులేవో చెప్పుఁడు.

భ్రమ—అవి చెప్పియే చూపింతును. అపనులే యన్నిఁటికంటెఁ ముఖ్యములుగావున శ్రద్ధతో వినఁగోరుచున్నాను.

సోమ—ఇప్పుడు నాకేమియుఁ బనిలేదు. సావకాశుఁడనై యున్నాను. సాయంకాలమగువఱకుఁ గావలసినంత తెలుపి. అటుపైన వేఁటకుఁబోవలెను. తిరుగ మూఁడుదినములవఱకు రాను. ఈదినమున మీరువచ్చుటవలన మిమ్ముఁ జూడఁగంటిని. లేనియెడల మీరీయూర నేను వచ్చువఱకుఁ గనిపెట్టుకొనియుండవలసివచ్చియుండును.

సుబ్బా—మహాప్రభూ! అటులైన మే మదృష్టవంతులము. మేముగూడ నీసాయంకాలమునందే సెలవుదీసికొనిపోయెదము.

సోమ—అలాగుననే.

భ్రమ—ఆరెండుపనులు చేసినంగా— మొదటిది—భట్టిరాజుగారి భార్యను బట్టుకొని యామెయొక్కమీఁదివస్త్రములను దీసికొని మీకుఁ బంపుట.

సోమ—ఆ—ఆ. మీవారు మాయందు జెలిపి విశ్వాసమును గనఁబఱచినాఁడు. ఏవియావస్తువులు?

భ్రమ—ఇదిగో చూడుఁడు.

సోమ—(చూచి) ఇదుగో! ప్రతివస్తువుమీఁదను శారదయని పేరున్నది. చాలసంతోషించితిని.

భ్రమ—(తనలో) ఇవి నిజముగా దేవరాజు తల్లిగారివస్తువులు కావు. అవియేమగునెడల వాని సీతవియొద్ద కాతఁడేల యుంచియుండును? (ప్రకాశముగా) ఇంతకుముందు సంతోషవార్త యేమనఁగా మా రాజుగారు దేవరాజును బట్టుకొని చెఱసాలలోనుంచినారు.

సోమ—ఇంత నాలస్యముగా నేలఁ జెప్పితివి?

భ్రమ—భక్ష్యములలో మంచివానిని గడపటికి వలయుంతుము కాదా.

సోమ—వాని రాజ్యము మాకు స్వాధీనమైనట్లే. ఇఁక వాఁడున్న సరే, యూఁడినసరే. కాని, అతఁడు మీయొద్దనేల? మీవారు మా యొద్దకే పంపలేకపోయినారా? ఈసంగతి మొగపుదాసిదానిని బంపుట కంటె వానినే మాకుఁ గానుకగాఁ బంపినయెడల మిక్కిలి బాగుగనుండునే!

భ్రమ—అతఁడు దేవరాజీయుని నిశ్చయముగాఁ దెలియక పోవుటచేతఁ బంపలేదు. ఆనిదర్శనము కలుగగానే బంపించెదము.

సోమ—ఆనిదర్శన మెట్లు కలుగును?

భ్రమ—ఇదిగో తీయుచున్నానుకాదా. (మఱియొక మూట విప్పును) మహాప్రభూ! యీ బాకెవనిది?

సోమ—ఏదీ? (చూచి) ఇది దేవరాజుదనియే నానమ్మకము.

భ్రమ—ఇట్టిబాకులు మఱియొకరి కుండఁగూడదా?

సోమ—ఉండవచ్చునులే. మఱియొకని దర్శనమేదియులేదా?

భ్రమ—తీయుచున్నానుగాదా. ఇదిగో! దర్భముడియుంగరము. ఇది తనకుఁ బురోహితుఁడిచ్చినాఁడని దేవరాజు చెప్పినాఁడు.

సోమ—నాకది యానవాలు తెలియదు. ఎవఁడురా అక్కడ?

(నేపథ్యమున) చిత్తము.

సోమ—కారలోనున్న సేనాధిపతి నిటకుఁ బాపుమని ప్రధానునితో నాసెలవుగాఁ జెప్పుము.

(నేపథ్యమున) చిత్తము.

సుబ్బా—అతఁడెందులకు?

సోమ—అతఁడా దేవరాజు నొక్కసారి బాగుగాఁ బరీక్షింపవలసి వచ్చెను. కాని మీదొరకు నాయందుగల యనురాగమునకు మిగుల సంతసించితి నని పదేపదే నీవు చెప్పవలెను.

సుబ్బా—ఇది యాత్మాపేక్షగాని యనురాగము కాదు. తమ కటాక్షముసంపాదించుకొనకున్న మాయాస్థానము నిల్చుమార్గము లేదు. అందుచే—

సోమ—ఆసందేహము తన కక్కఱ లేదని చెప్పుము.

(శ్రీకంఠదాసుఁడు ప్రవేశించును.)

సోమ—శ్రీకంఠదాసా! ఈదర్భముడియుంగరము నీవెచ్చటనైనఁ జూచితివా?

శ్రీకం—(చూచి) ఇది పురోహితునింటిలో దేవరాజువంటివాని వ్రేలిని జూచితిని. అతఁడు బ్రాహ్మణుఁడని నేననుకొనుట కిదియే ప్రబల హేతువు.

సోమ—ఆదర్భముడియుంగరమే యిదియని నీవు స్పష్టముగఁ జెప్పఁగలవా?

శ్రీకం—ఆ. నడుమునున్న జనలో కాయి సగముమాత్రమే యున్నది.

సోమ—సరే! నీవు పొమ్ము.

శ్రీకం—(నిష్క్రమించును.)

సోమ—సుబ్బారెడ్డి! భీమరసింగూ! పురోహితుఁడు, నతని భార్యయుఁ గూడ మాయమైనారు. వారిజాడ యేమైన మీకుఁ దెలిసినదా?

భీమ—ఇప్పటివఱ కేమియుఁ దెలియలేదు.

సోమ—అదికూడ కనిపెట్టవలయునని విచారణలోఁ జెప్పుము.

సుబ్బా—చిత్తము. చిత్తము.

సోమ—కాని, యదేమి; దాసురాలు తిరుగవచ్చుచున్నా దేల?

(పద్మిని, నెత్తిపై పాణకపెట్టుకొని యాఁడువేసముతో భైరవన్న ప్రవేశింతురు.)

సోమ—పద్మినీ! ఇటురా! దాసి నేల యమ్మాయి కీయలేదు?

పద్మి—ఇచ్చితిని. ఇది యేయూరనుండి వచ్చినదో, మాయింటి యొద్ద స్నానముచేయించి మంచిబట్టలు కట్టించి సాయంకాలమైనతరువాతఁ దీసికొనిరమ్మని చెప్పినది.

సోమ—బుద్ధిమంతురాలు! పట్టుతెసికొనినదా?

పద్మి—ఆ.

సోమ—అటులైన నది నెత్తిమీఁదఁ బెట్టుకొనినది పట్టెపాణక కదా, నెత్తిమీద నేలపెట్టుకొనవలెను?

పద్మి—పెద్దదగుటచేతఁ జేతితోఁ బట్టుకొనిన మొదలఁగాలికడ్డము వచ్చునని నెత్తిపైఁబెట్టుకొన్నది.

సోమ—దానిమీఁద లంగా కనఁబడుచున్న దేమి?

పద్మి—స్నానానంతరము ధరించుటకు సర్వమంగళమ్మగారు క్రొత్తదాసికిచ్చినారు.

సోమ—సరే! (తనలో) మనసు సందేహించుచున్నదేమి చెప్పుమా. ఏదీ! ఏదీ. అది యొకసారి తీసికొనిరమ్ము. (భైరవన్న పాణిక నెదుటం బెట్టును.)

సోమ—(తనలో) వట్టిభ్రమ మొందితిని (ప్రకాశముగా) పద్మినీ క్రొత్తదాసికి మీయమ్మ మంచిగా సరాయ మిచ్చినదే!

పద్మి—చిత్తము.

సోమ—సరే! అమ్మాయి యేమిచేయుచున్నది?

పద్మి—ఇప్పుడే యభ్యంగన మారంభించినది.

సోమ—అబ్బో! ఇంకొకజామువఱకుం దేవులమునకుంబోలు నేమి? నేను వేటకుంబోవులోపల నామెను జూచుటకువీలు లేదు—నేను వేటకుంబోయితిననియు మూడురోజులలో వత్తుననియు నీవామెతోం జెప్పుము.

పద్మి—చిత్తము. నేనుపోవచ్చునా?

సోమ—(అప) ఆదాసినిమాత్రము నీవు బాగుగాం గనిపెట్టి యుండవలెను సుమా.

పద్మి—(అప) చిత్తము.

సోమ—సరే! నీవు పొమ్ము.

భ్రమ—సాయంకాలము కావచ్చినది. మేముకూడ సెలవు తీసికొందుమా?

సోమ—ఈదినము నాకు నూతనమిత్రలాభము కలిగినది.

సుబ్బా—సామంతలాభమని సెలవిచ్చెదరు గాక.

సోమ—ఘోరామీందనుంచిన మీ యాయుధములను దీసికొనుండు. అట్లు శోధించినంతలకు మీ రన్యథా యెంచకుండవలెను.

భ్రమ—ఆ సందేహ మెంతమాత్రము వలదు.

సోమ—సరే! సంతోషము. నే నిప్పుడే పోవలసియున్నది.

శ్రీ

# పూర్ణిమ

---

సప్తమాంకము.

---

ప్రదేశము — దేవరాజ దుర్గమున అమ్మవారి (కాళికేశ్వరి) గుడిముందు.

ప్రవేశము — కేశవన్న.

---

కేశ — జయా! కాళికేశ్వరికి జయ! జయము! కాళికేశ్వరికి జయ! శత్రుంజయా! శత్రుంజయా!

శత్రుం — (ప్రవేశించి) జయా! కాళికేశ్వరికి జయ! ఓరీ! కేశవ! యుద్ధమైన లేకుండ నాతిజనము చచ్చినదిరా?

కేశ — అదేరా మనవాని తెలివి! "మేమీదుర్గమును గాపాడుకొనలేము. మాకింత భుక్తికేమైన నేర్పాటుచేసి దుర్గమును స్వాధీనపఱచుకొనవచ్చు"నని మనరాజు శత్రురాజులకు వార్తనంపఁగా నాతఁడంత తెలివితక్కువపని చేయుచున్నాఁడేమిరా యనుకొంటిని. సోమనాథుఁడిద్దఱు ముగ్గురు సేనాధిపతులతోఁ గొంత పరివారముతో లోనికిరాఁగనే ఇఁకనంతే—మిగిలిన సేనయంతయు నేమయ్యెనో కాని మాయమయ్యెను.

శత్రు — ఏమగుటకేమున్నది? పాతాళలోకమంత గోఁతిలోఁబడి చచ్చినది. మైలున్నరపొడుగున చందురువంకగా మనరాజు పెద్దగోఁతి నెందులకుఁ ద్రవ్వించెనో యనుకొంటిమి. అది యిందులకు.

కేశ — రాజు కొలఁదిపరివారముతో లోనికిరాఁగానే యాగోఁతిపైఁ గప్పిన కప్పులన్నియుఁ గ్రిందికిఁ బడిపోయినవా?

క్షమింపుడు. కాని కోటయావరణములో నున్న మీ బసలో నీరాత్రి నేను జేయించిన విం దారగించి కొంచెముసేపు శయనించి వెడలి పోవలెను.

సుబ్బా — చిత్తము. ఇంతటివఱకు మేము తినునది మీయన్నమే. ఇద్దఱము ముగ్గురు స్త్రీలతోడను నల్గురు సేవకులతోడను వచ్చి యుంటిమి. మేము వెడలిపోవునప్పుడు మావారి రాకపోకల కభ్యంతర పెట్టకుండునట్లు మీభటులకాజ్ఞాపించినఁ జాలును.

సోమ — మాబసలోనికి రాకపోకల కభ్యంతరములు కూడనా! మా సేవకులు కొందఱు మీయొద్దనుండి మీకుఁ దగిన సేవచేయు చుందురు.

భ్రమ — అక్కఱలేదు. మాకుఁ గావలసిన సేవకులు మాకున్నారు. మీసేవకులకు శ్రమమియ్యము. ఒక్క సమయము గానిచ్చుకొని యేరాత్రియో వెడలిపోవుదుము. ఇదిగో. మేము కొండదొరగారి సేవకులమని చెప్పుటకు మాకుఁ గోటముద్రయునున్నది. వెలుపలికి బోవ నిచ్చినఁ జాలు.

సోమ — నే నిప్పుడే యాజ్ఞాపించి పోయెదను. రామ్ రామ్.

సుబ్బా&భ్రమ — రామ్. రామ్.

అందఱు నిష్క్రమింతురు.

ఇతి షష్ఠాంకము.



...యింకోనున్నారా! అంతరాత్మ కాఁడుతనమేమి? మగతనమేమి? దేవరాజా! ఇఁక నీవు నన్ను బావగా భావింపుము. భార్యగానెంచకు ఇదిగో కత్తి—రా—రా—మాతండ్రి నెట్లుచంపెదవో చూచెదను. నను కారా హావుఁ నెద్దకు. ఆతనిని వశలిపింతును. చేతనైనయెడల నన్నుఁ వలెను.

దేవ—సెబాస్—సెబాస్—వీరకాంతా! సముదిన్యదర్శనమిచ్చి ఇద్దఱుఁ ప్రవు! దేశమున కలంకారమైన నిన్ను, భార్యగాఁ బడసిన నా యుంటే మహాదృష్టశాలి ప్రపంచమున నెవ్వఁడు? నీ కౌఁగిటికంటెఁ ద్రిలోక పెట్టున్యాధిపత్యమైన నాకెక్కువది కాదు. కత్తి చేతిలో నుండగానే యొక్క కౌఁగిలించుకొననిమ్ము. (అట్లు కౌఁగిలించుకొనను.) (గట్టిగతన మాసేచకొని) అయ్యయ్యో—అయ్యయ్యో—బ్రహ్మరంధ్రస్థానమునఁ చుండనాఁడు. (గడగడవడఁకుచు గద్గదికతో) అదిగో! నాతండ్రి అదిగో! తండ్రి-నాతండ్రి-పెండ్లికొడుకుదుస్తులతోఁ బ్రత్యక్షమైనాఁడు. నోరు నువ్వుచుకొని యున్నాఁడు. దాహముగుచున్నది కాఁబోలు. ఇదిగో. య్యేసలుగాట్టుకొనుచున్నాను. ఆలస్యమైనది తండ్రీ! ఇదిగో పోవు చున్నాను.

ని: (నిష్క్రమించును.)

సర్వ—(కత్తి విశాలముగా వైచి) అయ్యయ్యో! అదియేమి? అది ...మి? మతిపోయినదా యేమి? (కూడఁ బరుగెత్తఁబోవును)

(నేపథ్యమున) అదేమి—ఆ—అదేమి—ఆ—మతినాకా—నీకా—పోయినది.

కాత్యాయని—(తొందరతోఁ బ్రవేశించి సర్వమంగళను బట్టుకొనును)

కాత్యా—ఆఁగు ఆఁగు-నాథుక్తనుజంపినకిరాతుని పుణ్యాత్ముఁ

థమును జేసియుంటిని. శపథమును దీర్చుకొనలేని క్షత్రియుని బ్రతు
కెందులకు? నేను మాతండ్రిగారి కీ ఋణమును దీర్పకుండినయెడల
నాకుత్తమలోకము లుండవు. నాధర్మపత్నివైన నీవు నాయూర్ధ్వగతి
కై చూడనక్కఱలేదా !

సర్వ—ప్రాణప్రియా! మరణించి పైలోకమునకుఁబోయిన
గారి యాత్మశాంతికై యింతగాఁ దహతహలాడుచున్నావే; నీ
ప్రాణమే నాదికూడఁగదా! నీతండ్రి నీకెట్టివాఁడో నాతండ్రి నా
కఁడుకాఁడా? ఆతని క్షేమమునకై నీవిట్లు తొందరపడుచుంటివో
ని క్షేమమునకై నేనట్లు తొందరపడుట తగదా. ఎటువచ్చినను
దానినైపోయితినని లోకువ చేయవచ్చునా? ఆఁడుదాననై
నాలోపమా! నేను మగవాఁడనైనయెడల నిన్నిట్లు బ్రతిమా
లుకొందునా! ఎందులకుఁ గాని యాఁడుబ్రతుకు వచ్చినది. అస్వాతంత్రు
రాలనుగదా. నాకోరికఁ జెల్లించువాఁడు నాభర్తకంటె మఱియెవ్వఁడు?
ండి నిజాపిన దారుణస్వభావురాలు నీకు ధర్మపత్ని యెట్లగును?
ర్మపత్నియన్నమాట గౌరవమునకూడ దగులఁబెట్టనేల? నాప్రార్థన
మనఁగా నాకుటుంబమునఁ బ్రాణములుండఁగా మాత్రము నాతండ్రిని
ధాపక్షము. నీకాళ్ళపైఁ బడుచున్నాను. రక్షింపుము. (కాళ్ళపైఁ
బడును.)

దేవ—అయ్యయ్యో! నాకాళ్ళు వదలుము. వదలుము.

సర్వ—నాకభయమిచ్చినఁగాని నేను వదలను.

దేవ—అక్కొ చూచుకొనవచ్చునులే—యుండు వదలుము.

సర్వ—ఇదిగో వదలితిని. ఏమిచూచుకొనవచ్చునో చెప్పుము.

దేవ—సర్వమంగళా! నావంకఁజూడుము. నీ వింత పట్టుపట్టకు,
ండ్రి పిచ్చివాఁడైనాఁడు. నాహితజనవార్తవినినాఁడు. సర్వసైన్య
చావఁగఁ జూచినాఁడు. కష్టములచే మిగులఁ గాసినొందియున్నాఁ

భమును దేవ—అయ్యయ్యో! బ్రహ్మహత్య చేసినవానిని, స్త్రీహత్య చేసినవానిని—

సర్వ—ఆతఁడు కపట స్త్రీగా వించినప్పు డాతఁడు మారకుండునా?

దేవ—అయ్యయ్యో! మనపిల్లలను జంపవలయునని యంతఃపురములోనికిఁ బోయితివని యిప్పుడే కంఠోక్తిగా నాతోఁ బలికిన మీ తండ్రిని రక్షింపుమనుట న్యాయమా? నీకొడుకులను జంపఁదలఁచిన యాతని నీతండ్రియని యింకననఁదగునా?

సర్వ—ఎటులైనను నాకాతఁడు పూజ్యుఁడు. ఆతనిని మీరేమియుఁ జేయఁగూడదు. ప్రాణనాధా! మిమ్ము గడ్డము బట్టుకొని ప్రతిమాలుకొనుచున్నాను. నా ప్రార్థన నంగీకరింపుఁడు.

దేవ—ప్రాణప్రియా! నీమాట కడుగుదాటినవాఁడనుగాను. నిన్ను బ్రాణమునకంటె నెక్కువగాఁ జూచుకొనుచున్నాను. నీవే నా గృహలక్ష్మివి. నాబ్రతుకునకంత నీసౌభాగ్యమే యాధారము. నిన్నుఁ జూచుకొనుచు మహానందమున నున్నాను. ప్రాణము లఱచేతిలోఁ బెట్టికొని బ్రాహ్మణిపాదములమీఁదఁబడి యడవులపాలై దొంగలకుఁ జిక్కితుదకుఁ గాళికి వేఁటపోతుఁగాఁ జేయఁబడిన నావంటిపరమనిర్భాగ్యుని సర్వమంగళస్వరూపవు—సర్వసుగుణవు—నైన నీవు ప్రేమించి వరించి తండ్రిని గణింపక రాజ్యమును వదలి సర్వసౌఖ్యములవదలి అయ్యయ్యో! దొంగల కధిపతినై యధముఁడనైన నాయొద్దకు వచ్చి నన్నుసుఖపెట్టి చంద్రబింబములవంటి పిల్లలను నాకుఁ గటాక్షించి నా వంశమును నిలువఁబెట్టితివి. నీవుచేసిన మహోపకార మెన్నఁడైన మఱువఁగలనా! నన్నురక్షింపుము రక్షింపుము—ఇవి చేతులు కావు. వేడికొనినకోరికకు 'లేదు' అనిపలుకవలసినపాతకము, కృతఘ్నతయు నాకు రానీయకుండ రక్షింపుము. సర్వమంగళా! నీకునిషేధముఁడను. నాకు చావైయే నైన నాజ్ఞాపింపుము.

మున నిల్చినది. ఆవాయుస్పర్శమైన నాకు వలను. కన్నులుమూసి కొన్నను దానికంఠరవము వినఁబడుచున్నది. నేనువినలేను—వినలేను—చంపు—చంపు—శీఘ్రముగాఁజంపు. నాయనా! చంపవా? (అనిగట్టిగ నేడ్చును.)

దేవ—సర్వమంగళా! ఎవరినిరక్షింపుమంటివి!

సర్వ—నాతండ్రిని—నాతండ్రిని.

సోమ—వలదు—వలదు. నాయనా! నీకాళ్లపైఁబడెదను. పుణ్యముగట్టుకొనుము. అయ్యయ్యో! తిరుగ దానిమాట వినఁబడుచున్నది.

సర్వ—(అవధరించి) ప్రాణనాథా! నేను నీతోమాటలాడ వలసియున్నది. నాతండ్రినిప్పుడే యీ [illegible] రక్షింపుము

దేవ—(అప) అంతతొందరయేల?

సర్వ—ఉన్నది. రక్షింపుము.

దేవ—(అప) భైరవా! సిసిని మీరిద్దఱుఁ గొనిపోయి కారా నుంపుఁడు.

(భైరవన్న, భీమన్న, సోమనాథునితో నిష్క్రమింతురు.)

దేవ—ప్రాణకాంతా! ఏమిసెలవు?

సర్వ—నాతండ్రిని రక్షింపుమని ప్రార్థించెను.

దేవ—ఏల?

సర్వ—ఏలయని యడిగెదవేమి? సంధ్యావందనము చేయవ దని యెవ్వఁడైనఁ జెప్పినయెడల నేలయని ప్రశ్నింపవచ్చును. అస మాడవలయునని యెవ్వఁడైనబలికినయెడల నేల యనిప్రశ్నింపవచ్చు నాతండ్రిని జంపవలయునని నేను గోరినయెడల నట్లు పలికెదవేల నీవు ప్రశ్నింపవచ్చును. అంతేకాని వేదశాస్త్రసమ్మతమైన మహావ్యాపిధమైనదియు—

సోమ— హా! హా!

గీ. రజ్జువందున సర్ప వి ♦ భ్రాంతికలుగు
ప్రాకృతికునకు మోక్షసం ♦ పత్తి లేదు
నిశ్చలసమాధిఁ జేరిన ♦ నీకు మోక్ష
సంపదకు రజ్జువే సత్య ♦ సర్పమయ్యె
పాపబుద్ధిని రాజును ♦ గాఁడు సేయు
బ్రాహ్మణాధము నిట్లు చం ♦ పంగవలయు
దీనికంటెను సుందర ♦ మైనమార్గ
మేదొ భావిభూనాథు ♦ లీక్షింత్రుగాక.

ఇదిమైనదికదా! ఇంక నే నిక్కడ నెందులకు! అంతిపురివైపునకుఁ బోవుదును. (తొంగిచూచి) ఎవ్వరు లేరు. (పైకివచ్చును.)

భైర— పట్టుకో పట్టుకో. ఆఁగు ఆఁగు. అదిగో పట్టుకో. దేవరాజా! దేవరాజా! ఇటురా.

సోమ—(పరుగెత్తుచు నిష్క్రమించును)

భైర—(నిష్క్రమించును)

దేవ—(ప్రవేశించును) పశువులన్నియుఁ బరశురామ ప్రీతినొందినవి. చంద్రశేఖరస్వామియోజనకుఁ సమయమునకుఁబో లేకపోయితిని.

(నేపథ్యమున) అయ్యయ్యో! చంద్రశేఖరస్వామి చచ్చి పడియున్నాఁడు.

దేవ—హరహరా! హరహరా! ఎంత దుర్వార్తవింటిని. సోమనాథవర్మయే చంపి పాఱిపోయియుండును. ఇట్లు జరుగునని సందేహలేశమైన మనస్సునకుఁ దగులలేదుకద! అట్లైనయెడల గుహను గనిపెట్టుకొనియే యుందునే! హరహరా! చంద్రశేఖరస్వామిగారి నిశ్చలయోగ్యతనుగూర్చి భ్రమపడితిని. (తెంపలువైచుకొనును) ఆయనను జంపిన సోమనాథుని వెంటనే చంపుటకంటె నిప్పుడు కర్తవ్యమేమియు

మాత్రమే చెప్పియుంటిని. ఈతఁడిక్కడకు వచ్చినప్పటినుండియు నా యెడల నభిమానమున్నవాఁడువలెనే గనఁబడలేదు. కాశికో, శ్రీశైలమునకో పోవుదును సెలవిమ్మని యెన్నిమాఱులో కోరినాఁడు. నేను వదలలేక యంగీకరింపలేదను కోపము యాతనికున్నదేమో అంతేకాని నాపై శత్రుత్వమున్నదని నేను చెప్పలేను. పోనీ భార్యయందైన నభిమానముతోఁ బ్రవర్తించుచున్నాఁడేమోయనఁగ నదియు లేదని కాత్యాయనమ్మవలన విని కాఁబోలు నారాణి చెప్పుచున్నది. కాత్యాయనమ్మ మాత్రము నాయందు దల్లివలె నిశ్చలకరుణాన్వితమైయున్నది. నాప్రాణముల రక్షించినందుల కెఱిఁగియో యెఱుఁగకయో వాని ప్రాణములు నేను రక్షించితిని. అంతటితో బదులు తీరిపోవదా? కాని, యీతఁడు నాకొఱకసత్యమాడితినని మతభ్రష్టతనొందితినని చెప్పినాఁడు. వీని కేమిప్రత్యుపకృతియున్నది! లేదని యూరకుండవలసినదేనా—శాశ్వతముగా నాతనిఋణమునఁ బడియుండవలసినదేనా—సోమనాథవర్మను గుహలోఁ బెట్టుకొని యట్టె యెన్నినాళ్లైన గూర్చుండినయెడల నోరుమూసికొనియుండవలసినదేనా—నాశత్రువునకుఁ దానా శరణప్రదాతయగుట! మంచిమాటలతోఁ జెప్పిన వినకుండచున్నాఁడు. ఈతనిని బట్టినయెడలఁ దనప్రాణముదక్కదని మూమూము యిచ్చుటకుఁ జేరినాఁడు. ఇప్పుడేమిచేయవలయును? నాశపథమువ్యర్థమేనా ?

(నేపథ్యమున) దేవరాజా ! దేవరాజా ! పసువులపాక యంటుకొన్నది. ఎవ్వరు రాకుండిరున్నారు.

దేవ—(తనలో) అంతేకాదు పెద్దపసువులపాక (హృదయముఁ జూపి) యిప్పుడు దగులఁబడుచున్నది. (ప్రకాశముగా—అప) భైరవా! జాగ్రత్త. (నిష్క్రమించును.)

సోమ—బ్రాహ్మణోత్తమా ! నా ప్రాణములు రక్షించితివి. మిక్కిలి సంతసించితిని. నీవు నీభార్యతోఁ గుట్రచేసి యామెచేత నుత్త

హా సోమనాథవర్మా-సోమనాథవర్మా-ఇదిగో వచ్చుచుంటిని.

(పరుగెత్తును)

సోమ—(నిష్క్రమించును)

భైర—(పరుగెత్తుచుండఁగా కాలికిఁ బద్మినితగుల గ్రిందఁబడిపోవును.) హారా-హారా-యిదియేమి-కాలి కేదో యడ్డమగులుటచేఁ బడిపోయితిని. దేవరాజా! దేవరాజా! సోమనాథవర్మ యాతఁడు బరుగెత్తుచున్నాఁడు. పట్టుకో! పట్టుకో. హా! హా! ఇదియేమి? పద్మిని చచ్చిపడియున్నదే! అయ్యయ్యో! ఎందుచేతనో యెక్కడను దెబ్బ తగలినట్లగపడదే?

దేవరాజు—(ప్రవేశించి) ఏఁడీ! ఏఁడీ!

భైర—రాజేంద్రా! పద్మిని యెక్కెటకి మృతినొందినది.

దేవ—ఏదీ-ఏదీ.

భైర—ఇదుగో చూడుము. దెబ్బ యెక్కడ నగుపడదు.

దేవ—అతఁడు గొంతుపిసికి చంపి యుండును. భైరవా! దాని నిటనుండి తీసివేసి వెంటనే మామామగారిజాడ కనుపట్టుము. నేనుగూడ వెదకెదను. భరిమరసింగు, సుబ్బారెడ్డి, మొదలగు వారందఱు పోవుటచే నీకు శ్రమనిచ్చుచుంటిని క్షమింపుము.

భైర—పద్మినీ! కవినిగట్టుకొని నీవు సుఖపడలేదు. నిన్నుగట్టుకొని కవి సుఖపడలేదు. (ఎత్తుకొని నిష్క్రమించును)

(వెంటనే తెరయెత్తఁబడును. చంద్రశేఖరుఁడు జపముచేసికొనుచు ప్రవేశించును.)

(నేపథ్యమున) సోమనాథవర్మ యిచ్చట నున్నాఁడా! (మఱియొక కంఠరవముతో) లేఁడు లేఁడు. అతనికొఱకే వెదకుచున్నాము.

(అంతమునుఁగుతో సోమనాథవర్మ తొందరగాఁ బ్రవేశించును.)

సోమ—దాహము; దాహము. కొంతమంచినీరిచ్చి పుణ్యము

కట్టుకొనవా? మహాత్మా! రక్షించు. రక్షించు. (చంద్రశేఖరస్వామి కాళ్లపైఁ బడును.)

చంద్ర—నీ మొగము నాకగపడుట లేదు. ఎవరవు నీవు?

సోమ—ఎవఁడనైననేమి? నీపాదములమీఁదఁ బడితిని. దాహ మిమ్ము. రక్షించుము.

చంద్ర—సోమనాధశర్మా! నీవేనా?

సోమ—అట్లు చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. రక్షించు. రక్షించు.

చంద్ర—రక్షించితిని లెమ్ము. ఇదిగో! తీర్థమును దీసికొనుము.

సోమ—(పుచ్చుకొని) నేను మీకభ్యాగతుఁడనే కాక శరణార్థిని కూడను. మీరు నన్నిట్లు కాపాడుదురో! వెనుకటియంశము లేమియు మదిలోనుంపక రక్షించితినని యభయమిచ్చితి రదియే చాలును. కృతార్థుఁడనగుదునను ధైర్యమునే నుండవలసినదే కాని తీవ్రశాసనుఁడైన దేవరాజు నన్నుఁ జంపుటకై తరుముకొనివచ్చుటచేతఁ బ్రాణము తహతహలాడుచున్నది. ఈతలుపునకు లోనగొళ్లెము వేయనా?

చంద్ర—మఱేమియుఁ దొందరలేదు. శాంతచిత్తుఁడవై కూరుచుండుము.

సోమ—తనకువిరోధియైన నాకు మీ రభయ మిచ్చినందులకు మిమ్మాదేవరాజు శిక్షించునేమో!

చంద్ర—ఆతని కభయమిచ్చినందులకు నీవు నన్ను గోతిలోఁ బూడ్పింపలేదా. అట్టి యాతఁడును చేయునుగాక! ఆయుస్సు పరిసమాప్తియగువఱకు మీ రెంతచేసినను మృతినొందరుగదా.

దేవరాజు—(ప్రవేశించి) మహాత్మా! నమస్కారము. మామగారూ! మీ రిటురండు.

దేవ—భైరవన్నా!

భైరవుఁడు—(ప్రవేశించి) ఏమిసెలవు ?

దేవ—(అప) చూడుభైరవా! చంద్రశేఖరస్వామిగుహలో సోమనాథవర్మయున్నాఁడు. ఆతని నిప్పుడు చంపుటకు వీలులేకున్నది. నీవుగుహకు వెలుపలనే నీజట్టులోనికొందఱితో గనిపెట్టుకొనియుండుము. వెలుపలికిరాగనే యాతనిని బట్టుకొనుము. గౌరవపూర్వకముగాఁ గాళికాలయముననుంచుము. ఆతని మీరెవ్వరు చంపఁదగదు. దుర్భాషలైన నాడఁదగదు. తెలిసినదా!

భైర—(అప) చిత్తము

దేవ—(తనలో)చంద్రశేఖరస్వామి బుద్ధిపూర్వకముగా నీతనికి శరణమేల యొసఁగెనో! కాత్యాయనమ్మ నన్నేఁగియుండి నాకభయమీయలేదే. ఆమెయిచ్చినయభయమును స్థిరపఱచుట కీతఁ డెంత ప్రొక్కులాటయోపడినాఁడు; వెనుకఁ గొలఁదిమారమున సోమనాథుని దఱుముచునేయుంటిమి. ఆతఁడీగుహ నెప్పుడు ప్రవేశించెనో, యెప్పుడురక్షింపుమని కోరెనో, యెప్పుడాతఁ డంగీకరించెనో—ఏదీ—ఱెప్పపాటులోననేకదా నేనుగూడ గుహలోనికివచ్చితిని. అప్పటికే శరణార్థిత్వము, నభయప్రదానముకూడ నైపోయినవా. నాకేమోకాని సందేహముగానున్నది. అంతద్రోహము చేసినను బార్వప్రభునియందే యభిమాన మీతనికెక్కువగానున్నదా. ఈతఁ డాతనిని వదలకుండిన నేనేమిచేయవలసినది. ఈతఁడు నాకు మహోపకార మొనర్చినాఁడు. పోయినప్రాణమును దిరుగ నిచ్చినాఁడు. అందులకుఁ గృతజ్ఞుఁడనై యుండవలయును. అట్టుంటినని యే నానమ్మకము. ఆతని,నాతని భార్యను గోతినుండితీయించి వారిప్రాణముల రక్షించితినిగాదా. అది నాభటుల పనికాని నాపనికాదందురేమో! అట్టియాపదనుండి తొలఁగింపుఁడని నేను నాభటుల కాజ్ఞయిచ్చియుండ లేను. నిజమే. తీసికొనిరండని

జవిని నైచినమొదల నింతకుపద్రవము వచ్చియుండదుసుమా! నగరీతిని సర్వమునగరను దిక్కుబాటు చేసియుందుము. దేవరాజశరణప్రదాత యగుపురోహితుఁ డిక్కడకు వచ్చియుండఁడు. ఈ యంతరిమే జరిగియుండదు. కావున సర్వమహానర్థాపాతమునకు నీవు కారణముగాఁ గనఁబడుచున్నావు. నావాఁడవు కావు. నిన్నెలచావఁగూడదు? ధరణీనాథులకు నీవంటి దాసివలన రాజముప్పు మైనదున్నదా! అదిగాక నాతోవనే యీరహస్యము చెప్పినదానవు మఱియొకనికిఁ జెప్పకుందువా? కావున నిన్నుఁ జంపకతప్పదు. సంవత్సరము క్రిందట వానిని గొంతు నులిమి చంపినయెడలఁ బైసంవత్సరమునకు మతోనియుఁ గొందరయుండదు. అటుపైన పీలువెంబడిని మఱియొకదానిని బ్రభువులందఱు నాచరింపవలసినపద్ధతి యదిగా నాకగపడుచున్నది. ఈ యాతనాచారమునకు నేను మార్గదర్శిగా నుండవలసివచ్చినందులకు విచారించుచున్నాను. కావున- (వెనుకనుండివచ్చి గొంతుఁ బట్టుకొనును.)

పద్మ—ఉ. ఉ. (క్రిందపడి కొట్టుకొని చచ్చును.)

సోమ—చచ్చినట్లెకద—చచ్చినట్లెకద!

(నేపథ్యమున) ఆ! చావకేమి! చావకేమి!

సోమ—(అదరిపడుచు) వారెవ్వరు? వారెవ్వరు?

(నేపథ్యమున)

భైరవి—ఆది.

సేనాధిపతి చచ్చినాఁడు-మన-దేవరాజుని చేతిలోను

సోమ—(అటునిటు పరుగెత్తుచు) మిగిలిన యొక సేనాధిపతి కూడ చచ్చెనా? హా! హా!

భైరవన్న—(ప్రవేశించి) ఏనాఁడు వినపట్టి యుగ్రప్రతాపము
మానాథునకుఁ గల్గె మాపుణ్యమహిమను జేసినా!

(పాడును.)

కట్టియావదలనైనఁ గటాక్షింపుముగాని, ఆఁడుపిల్లలనుమాత్రము కటాక్షింపకుము. ఒక్కపిల్లతోఁ గొండనెక్కవలయునని యిట్టిమాట లూరితిని. అది యిట్లు చేసినది. ఇఁకఁ జచ్చుటతప్ప వేఱుగతి లేదు. ఇప్పుడు తిరిగి చచ్చుటయేల? దానికి శీఘ్రోదయ మెప్పుడైనదో యిప్పుడే నాశిరచ్ఛేదన మైనది. (ప్రకాశముగా) పద్మినీ! ఇదియు సరిగనే చెప్పినావు. సంతసించితిని. నీవును నదియు నిటకు వచ్చి యెన్నిమాసములైనదో జ్ఞప్తి యున్నదా ?

పద్మి—పదునైదుమాసములు కావచ్చినది. ఏదీ, వచ్చినమూఁడుమాసములలోపుననే యామె నీరు మోసికొనినది. నిండుగాఁ దొమ్మిదినెలలుమోసి యిద్దఱు పిల్లలఁ గనినది. ఇద్దఱును మగపిల్లలే.

సోమ—(తనలో) ఆ నిర్భాగ్యురాలి నాపుత్రునైన నీయమంగళత తెగటాఱునదికాదా! ఇఁక నొక్కతరమువఱకు సాగకున్నదా! (ప్రకాశముగా) చూడు పద్మినీ! ఇటురా. నసయని చెప్పి రవంత వత్సనాభిదెప్పి యిరుగఁదీసి యాపిల్లల గొంతులలోఁ బోయుఁగలవా ?

పద్మి—బాబూ! నోరెఱుఁగని శిశువులు. మీకేమి యపకారమొనర్చినారు?

సోమ—పద్మినీ! నిజమనుసుమా! కోపముఁ బట్టలేక యట్లంటిని. క్షమింపుము. కాని పురోహితుఁడు గనఁబడఁడేమి ?

పద్మి—ఆతఁడెప్పుడా పశ్చిమపుగదివిడచి యీవలకు రాఁడు.

సోమ—పోనీ! బ్రాహ్మణుఁడు. వానిగోలి మనకేల ? చూడు పద్మినీ! మఱియొక్కమాట; నీవుగ్గుపాలనుండియుఁ గోటలోఁ బెరుగుటచేత నిన్ను నేను గన్నబిడ్డవలెఁ జూచుకొంటినిగదా; అందువలననే గదా నిన్ను నాపిల్లకొద్ద నుంచితిని. ఇట్టి నీవే యిట్లుచేసితివా? నేనెవ్వతెను నమ్మక నిన్నొక్కతెనే నమ్మియుంటినే! చూడు! పురోహితదంపతులను విడిపింపుమని అది నీతోఁ జెప్పినప్పుడు నీవు రవ్వంత నా

మఱికొంత చూచెదను. (ప్రకాశముగ) దేవరాజు చూచినయెడల నీతలఁ బగులఁగొట్టునేమో యని భయపడుచుంటివా? దేవరా జిప్పుడు నీకు నాకంటె నెక్కువవాఁ డయ్యెనా? ఆతనియెడల భయమా? నాయందు నిర్లక్ష్యమా? గోడితెకుముండవైనప్పుడు కోటలోఁ బ్రవేశించితివే- నాసొమ్ముమూలమున నింతదానవైతివే- ఇప్పుడు నన్ను గడ్డిపరకకంటె నీచముగఁ జూచెదవా- నీసిగదఱుగ- నీగొంతుకోయ్య. (వీపుపైఁ గొట్టును.)

పద్మిని—అమ్మయ్యో-అమ్మయ్యో- నన్నుఁ జంపుచున్నారు. బాబూ-బాబూ. (ఏడ్చును.)

సోమ—గట్టిగ నేడువకు-ధ్వని యైనయెడల దౌడవిఱుగఁగొట్టెదను. (దౌడపైఁ గొట్టును.)

పద్మి—బాబూ! రక్షించు-రక్షించు.

సోమ—రక్షింతును. ఏల పరుగెత్తితివో చెప్పు.

పద్మి—చెప్ప లేదా.

సోమ—దేవరాజు కొట్టునని యేనా- అది పట్టి అసత్యము-మరియొకకారణ మేదైనఁ జెప్పుము.

పద్మి—అంతకంటె మంచికారణము మఱియేదియు లేదు.

సోమ—లేకపోవుట యేల? అది యేలాగు స్ఫురించినది? ఆలోచించి మఱియొకటి చెప్పుము.

పద్మి—ఆలోచించుటకు బుద్ధియెక్కడ దున్నది బాబూ!

సోమ—(తన్నుచు) బుద్ధిలేనిపనిఁ జేసితివనుట స్పష్టము. అది యేదో చెప్పెదవా లేదా? (రెండు చెవులు పట్టుకొనును.)

పద్మి—తప్పుజరిగినమాట నిజమే-బాబూ-రక్షించు-రక్షించు. కాని, నావలనమాత్రము జరుగలేదు.

సోమ—అలాగునరా-దారికోనికిరా- నిన్నేమియు నే ననను.

స్థితిగతులభేదమే సద ♦ గతికిగతేము.

ఇప్పుడు మీకు బ్రహ్మారంధ్ర మంటినది. కాబట్టి, నట్లను చున్నారు. ఫిరంగికత్తులిండ్లలో పలంబెట్టి పొదువత్తులు చేబట్టిన మా యోధులను—ఇనుపకవచము లూడదీసి బంగారుజలతారు బట్టల ధరించిన యోధులను—నిమిదినాదలను గక్కుఱుమునవీయకుండ, రైననడుగనీయకుండ మీరు చంపలేదా! భీష్మసన్నిభుండగు తండ్రి గారిని—హరహరా—అప్పుడు నేను విచారించితిని. ఇప్పుడు మీరు విచారింపవలసినదే కాని, మాది తప్పని యధిక్షేపింపనేల? మీరు చేసినపని మంచిదా? అదియే మేముచేసిన దప్పు. ఇది యేటి న్యాయము! గుణదోషగణనమునకు మీ బాధయేనా కొలపాత్రము. మీదియుం దప్పే. మాదియుం దప్పే. శత్రుసాహిత్యము నాకు లేదనికదా యధిక్షేపించితివి?

కుమా—ఔను. అధిక్షేపించితిని మఱియొక్క—మా తప్పు నధిక్షేపించుచుంటిని.

దేవ—సరే! నాకది లేదనియే యొప్పుకొనుము. నీకదియున్న దని చెప్పగలవా? కత్తులు,కటారులు,తుపాకులు, ఫిరంగులు ఉపయోగపఱచి యుద్ధము చేయుటమాత్ర మేమంత గొప్పపని! నీవట్లుజయింతు వేని నిజముగ నీకత్తిగుణమా! నీగుణమా! కత్తి మొండిదైన నీప్రబతుకుకూడ నంతటిదే కద. గ్రుడ్డియాండ్రైనను దముముకొనుచు ఫిరంగికి నిప్పంటింపలేదా! దానికి విజయబిరుద మీయవచ్చునా? శస్త్రమాత్రకత నీబలమా, ఫిరంగిబలమా? నీభుజబలమే నిది. నీబుద్ధియే నిది. నీపౌరుషమే నీది. ఇతరసాధనము లన్నియు మాయలే. మగవాండవైనయెడల గత్తినిబాఱవేయుము; రమ్ము. నీకు సందేహమక్కఱలేకుండ నదిగో నేను బాఱవైచితిని.

(పాఱవైచును)

గీ. కత్తి విడనివాని ♦ ఘనుఁడందురది కాదు
కత్తి విడుచువాఁడె ♦ ఘనుఁడు సుమ్ము
కత్తి యోధవరుని ♦ ఖ్యాతినిహరియించు
కలియఁబడుటలోనె ♦ గలదు యశము.

ప్రబలజీవన్మహాపదగ్ర ♦ బాహువులకు
తగుయశము చచ్చుకత్తికిఁ ♦ దార్పఁదగును
దేవుఁడు మహాత్ముఁ డొసఁగిన ♦ దేహములను
భంజనమునందు సార్థక ♦ పఱుతమింక.

కుమా—నీకు మతియున్నట్టు గానఁబడదే—

దేవ—వెఱ్ఱివానికి లోకమంతయు నట్లే.

కుమా—అదేమి కత్తి పాఱవైచినావు? సాధనములన్ని మాయలే యనుచున్నావు. కలము నా ఖ్యాతి హరించుచున్నదని కవి దాని పాఱవైచునా! పాఱవైచి దేవుఁడిచ్చిన చేతితో వ్రాయునా?

దేవ—ఈయసందర్భప్రశ్నమున కుత్తరమీయకుండిన నీవుచిన్నబుచ్చుకొందువని చెప్పుచున్నాను. కలముతోఁ గవి వ్రాయుట లోకసంగ్రహార్థముకొఱకు కాని తనకేల? అట్టియావేశము కలిగినప్పుడు గాలి స్తంభించి వినునట్లాతఁడు గానమొనర్చును. వేదము లెవరు వ్రాసిరి? అవినిల్చినవా, లేదా! యథార్థకవిత కాకాశమే పుస్తకము. కన్నున్నవానికిఁ జుక్కలవలెఁ దేజోమయాక్షరము లందులోఁ గనిపించును. కత్తులప్రసంగములోఁ గవిత్వపుగొడవయేల? నీవు కత్తిని బాఱవేయకుండ నున్నావు. కత్తి నివదలినయెడల గాత్రమునిలువదని భయమున్నవాఁడవు కావున, నీవు వదలవలదు. నేను రక్తహస్తుఁడనై నీతోఁ బోరెదను. రమ్ము.

కుమా—నీవంటిమూర్ఖుఁడను నేనుగాను—కాచికో.

(నికత్తి ష్ఠను.)

దేవ—(లాఘవమున వెనుకవైపునకువచ్చి యూరేని చేయిబట్టుకొని కత్తి నవతలఁ బాఱవైచి) గుద్దిన నేనుఁగునైనఁ జంపఁగల యీ ముష్టితోఁ గ్రుద్దుచున్నాను. కాచికో. (ఊ-ఊ అని గ్రుద్దును.)

కుమా—హా—హా. (నేలఁ(బ్రా)లును)

భైర—(ప్రవేశించి) భళిరా—భళిరా దేవరాజా! భళిరభళిరా—దేవరాజా.

దేవ—భైరవకవీ!

భైర—ఒకగ్రుద్దుతో ... నుక్కడంచినావు నీవు ॥భళి॥
మీదుశౌర్యమునకుఁ గాళి మెచ్చి తాండవింపుచుండె.
భళిర—భళిర—భళిరదేవరాజ!॥

దేవ—భైరవకవీ! స్తోత్రములువలదు. కాని, యూతఁ డెట్లున్నాఁడో చూడుము—

భైర—(చూచి పాడును.) గుండెమీఁద గ్రుద్దు దగుల గుండె లవిసిపోయెనయ్యా-భళిర-భళిర-

దేవ—వాని నటుల నిమ్మళముగాఁ దొలఁగింపుము—

భైర—(వానిని లోనికిఁ దీసికొనిపోవును.)

(నేపథ్యమున) ఓరే! దేవరాజా! దేవరాజా- సేనాధిపతి నవలీలఁ జంపించితివఁటరా!

దేవ—చావని సేనాధిపతివి నీ వొక్కఁడవు వున్నావా—కానీ—కానీ. నేనే లోపలికి వచ్చెదను. నీ విచ్చటి కేల?

(నేపథ్యమున) ఏమీ! నే నొక్కఁడనే చావక మిగిలితినా!

దేవ—తప్పాడితిని క్షమింపుము.

(నేపథ్యమున) నాచావో నీచావో యిప్పుడే తేలనై యున్నది. ఇదిగో వచ్చుచున్నాను.

దేవ—నీవు రావలదు. నీసోదరుని రక్తముతో నీస్థల మపవిత్ర

మైనది. నేనే వచ్చుచున్నాను—నేనే వచ్చుచున్నాను. (దేవరాజు నిష్క్రమించును.)

పద్మిని—(తొందరతోఁ బ్రవేశించి) అమ్మయ్యో-అమ్మయ్యో నేను రాను- రాజా! నాతోఁగూడ రాకుము. (పరుగెత్తుకొని పోవును)

సోమనాధుఁడు—(ప్రవేశించి) పోకు-పోకు. (పరుగెత్తి పట్టుకొనును.) భయమేల పద్మినీ! తొందరపడకుము. నిన్ను నేను వృధగఁ జంపువాఁడను గాను. నాకుఁ దెలియవలసినయంశము లన్నియుఁ దెలిసినవి. నీవు దాఁచిన వినియోగము లేదు. నిజమేదో చెప్పు. నిన్ను వదలివైచెదను. ఏమియు దాపకుము.

పద్మి—దాఁచుటకుఁగాని, వెల్లడించుటకుఁగాని, నాకు రహస్యము లేమియు లేవు. నావలనఁ దప్పేమియు లేదు.

సోమ—తప్పు లేనియెడలఁ బిలుచుచున్నప్పటికిని నేను రాను రానని యిట్లు మొగము చాటువేసికొని యేల పరుగెత్తుచుంటివి? మీరు యథార్థముగ బలాత్కారమునకే దొంగలచే దేవరాజుప్రోత్సాహమున హరింపఁబడి యిట నుంపఁబడినవారైనయెడల నీవు నన్నుఁ జూచుటతోడనే మహాప్రభూ! మాగతి యిట్లయినది. అంతఃపురములలో నుండవలసినవార మడవులలో నున్నాము. మేము మీకొఱకు వేగపెట్టుకొని యున్నామని యేడువవలసినది కాదా- అట్లు చేసితివా- చేయలేదు. పిలిచినఁగూడ రాకుండఁ బరుగెత్తుచుండఁగా నీయందు దోషము లేదని బుద్ధిహీనుఁడైన నమ్మునా-నీవేల పరుగెత్తితివి?

పద్మి—నీతో మాటలాడుచుండఁగా దేవరాజు చూచినయెడల నాతలఁ బగులఁగొట్టునేమో యని పరుగెత్తితిని.

సోమ—(తనలో) సత్యమేమొ యుండవచ్చును. దీనివలన గాని నాబిడ్డవలనఁగాని దోషమేమియు లేకయుండవచ్చును. అయినను

భైర—వహ్వా! రణోత్సాహులై మావారు శత్రువులను చంపుచున్నారు.

వేయి—శత్రుబలుదేర వేయి—నేలను గొట్టిరాయి—కత్తి విసటికి వేయి
కొటికేయి బటికేయి నలిపేయి ॥పల్లవి॥

(నేపథ్యమున) వేయి—వేయి—వేయి.

భైర—భైరవేశన్నకవిదార—నూర్చిన తేజధార—జల్లున నాలుగ
లూర—నాకార—తాళిగార—ప్రియంగారా ॥పగ॥

(నేపథ్యమున) జయా—కాళికేశ్వరీ—జయా కాళికేశ్వరీ.

భైర—జయ్యా కాళికేశ్వరీ! సెబాస్—సెబాస్. మాకొండవారే వరాహపురభటులను గెలిచినారు.

(నేపథ్యమున) అయ్యయ్యో—మొట్రో—బాబో—మొట్రో—చచ్చితిమిరో. మోటగాడిదెకోముకులు.

భైర—వహావ్వా! వహావ్వా! శత్రుభటులు పరుగెత్తుచున్నారు. అన్నలారా! వారిని దెల్లమద్దిచెట్లవఱకు తఱుముఁడు తఱుముఁడు.

(నేపథ్యమున) ఓ వరాహపురభటులారా! ఆగుఁడు. ఆఁగుఁడు. ఆమద్దిచెట్లయొద్ద దొంగగోతు లున్నవి. వానిలోఁ బడిపోవుదురు. జాగ్రత్త. జాగ్రత్త.

గీ. తిరుగుడీ, తిరుగుడి యుద్ధ • ధీరులార
కొండకొరనిప్పుడే యీడ్చి • కొట్టుచుంటి
సోమనాథు ప్రాభవమైన • జూడవలదె
హరహరా మీరు కొజ్జాలో! • ఆఁడువారో!

భైర—వరాహపురసేనాధీశుఁడు, మారాజు నొకరి నొకరు కొట్టుకొనుచు నిక్కడికే వచ్చుచున్నట్లున్నారు. ఈ ప్రక్క నుండి మఱి యొక్క యుద్ధగీతము పాడెదను.

(అని ప్రక్క నునిలుచును)

(దేవరాజు, కుమారసింగు ప్రవేశింతురు.)

కుమా—ఛీ! దేవరాజా! నీపౌరుషము!

గీ. కొండచరియలనుండిరాళ్ ♦ గుమ్మరించి
కొఱవిదయ్యంపువెలుతురుల్ ♦ కూర్పఁజేసి
కోటిపాతాళగుహలైనఁ ♦ గుస్తరించి
కొలఁకులంతటి దొంగయూ ♦ బులరచించి
సేననంతను మ్రింగితి ♦ ఛీ! దురాత్మ!
గోఁటియుద్ధంబు నీనాఁడు ♦ జాతమందె
యూబియుద్ధంబు నీనాఁడె ♦ యుద్భవించె
పృథివివీరాధివీరుఁడ ♦ వీవికావె
శస్త్రశాస్త్రీయసాహితీ ♦ శక్తిలేక
పాఱితోఁ దొల్లితోఁ గడ్డ ♦ పాఱితోడఁ
గూలి దౌర్భాగ్యమగుదిక్కు ♦ మాలినట్టి
పోకడలుగల్గు రణముల ♦ బూని తహాహా!

దేవ—సేనాధిపతీ! మేము మాటవికులము. బీదవారము కావున మాకుయుద్ధసాధనములు పారలు, గునపములకంటె నెక్కువయుండుట కవకాశము లేదు. కాని, పౌరుషము మాకు లేదనుట తప్పు మాకును పౌరుషమున్నది. కాని, నీమాటవలన నీకుఁ బూర్వస్మృతియే లేనట్లు స్పష్టమగుచున్నదేల?

గీ. నవ్యనారికేళపు బొం ♦ డ్లములతోడ
మామిడాకులతోరణ ♦ మాలతోడ
బుగబుగలఁజిమ్ము పన్నీటి ♦ బుడ్లతోడఁ
దోపురాణి వాసపుఘుటా ♦ టోపుతోడ
కంకణపుఁబోరొసగ్బిరి ♦ గాదె మీ
గడ్డపాఱల రణములఁ ♦ గలదె తప్పు
మీదు పౌరుషమింతయో ♦ మాది యంతె.

# పూర్ణిమ.

కములు చేసిన యతండు దుః ♦ ఖభయజనక
నాటకం బెట్లు రచియించి ♦ నాండొ చెపుము !

సూత్ర — ఆయన గ్రంథకలాపములోఁ బ్రధానరసము హాస్యమను మాట నిజమే కాని, తదితరరసములు లేవా ? శ్రీమద్రామా నాటకములలో శాంతకరుణరసములు లేవా ? ప్రచండచాణక్య భయానకరౌద్రములు లేవా ? రాధాకృష్ణనాటకమున భక్తిరసము వెల్లివిరియుట లేదా ?

పారి — ఉన్నవి. ఇప్పుడాయన కేబదియేండ్లు కావా ?

సూత్ర — ఏబదియేండ్లకు నీనాటకమునకు సంబంధమేమి ?

గీ. కాంచుటకు రెండు ♦ కన్నులే కలిగినట్టి
పూర్వవయసునఁ గాన్పించు ♦ పోల్కిఁ బ్రకృతి
కానిపించదు నాలుగు ♦ కనులతోడ,
వర్తనము సేయు నుత్తర ♦ వయసునందు.

సూత్ర — జగత్తు దుఃఖభూయిష్ఠమని యుత్తరవయసులో దృష్టిగుననియా నీయభిప్రాయము ? కావచ్చును. కాని, కన్నులకును జ్ఞానమునకు నది తెల్లమై గోచరించును. ప్రకృతి యథార్థరూపమే అది.

పారి — కనుక నీనాటకము కష్టభూయిష్ఠప్రపంచనాటకము యొక్క ప్రతిబింబమా ?

సూత్ర — ఆ! అట్లే — కాని,

ఆ. పాత్రపాళి దివ్య ♦ పాత్రంబుగల దొండు,
పాత్రచరితలందుఁ ♦ బరమపావ
నంబు నద్భుతంబు ♦ నారీసుశీల ప్ర
కాండమైన చరిత ♦ గలదు బావ !

నర్మినిశాంధకారములోని తారాదీప్తివలె నది యేది?
శారదాసహగమనము.

శ్రీరామ.

# పూర్ణిమ

---

నాంది.

మ. పగలన్నాసములన్మహాహవముల ♦ న్నాపాస్తులన్నిందు నీ
జగతిన్నోఁచెడు మున్నరీచికలఁ దృ ♦ ష్ణాలోల్వపునంచేగి, పె
న్నగతాపంబునఁజిక్కి డీలుపడు న ♦ జ్ఞశ్రేణిరక్షించుతన్
భగవద్రాఘవవారివాహము సుధా ♦ ప్రావృట్పయోధారఁ

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—నటీ—ఇట నటీప్రసక్తి యేమున్నది! పారిశ్వకా!

పారి—(ప్రవేశించి) బావగారు నటినిమాని నన్నుఁ బిలిచినారందు చేతనో!

సూత్ర—బావా!

గీ. వీర్యవంతులు పురుషులు ♦ వినిన నోడలు
జల్లుమనునట్టి బీభత్స ♦ చండకృత్య
ములను, శోకావహపు గృత్య ♦ ములనునిండు
నాటకంబిది, నటిఁబిల్వ ♦ నాకుఁ దగదు.

పారి—అట్టినాటకమురచించినవా రెవ్వరు?

సూత్ర—బహుసరసనాటకరచనాపటిష్ఠులగు పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పారి—గీ. తెలిచినది మొదలుల్మాసెను ♦ వణకుఁ గడుపు
చెక్కలుగ నవ్వుపుట్టించు ♦ చిత్రనాట

